తా॥ వైద్యుఁడు రోగియొక్క దక్షిణహస్తమును వామచేయి మొదలుకొని తన వామహస్తముచేఁ జక్కగ పిసికి ఆహస్తముయొక్క అంగుష్ఠమూలముపందలి లోభాగ మధ్యమును తన దక్షిణాంగుళి త్రయముచే సనాళగతిని బరీక్షించి రోగనిదానంబు నెఱుంగవల యును.

మతాన్తరే

శ్లో॥ ఈషద్వినామితకరం వితతాంగుళీకం ।
బాహుం ప్రసార్య రహితం పరిపీడనేన ॥

తా॥ హస్తనిదానమును తెలుసుకొనునపుడు రోగియొక్క హస్తమును పిసికి మెటికెలు విఱిచి చేయిచాఁపించి అంగుళముల పట్టువదలించి నిదానము నెఱింగి రోగము తెలిసికొనవలయును.

వైద్యునికర్తవ్యము,

శ్లో॥ స్థిరచిత్తః ప్రశాన్తాత్మా మనసా చ విశారదః ।
స్పృశేదంగుళిభిర్నాడీం జానీయాద్దక్షిణే కరే ॥

తా॥ నేర్పరియగు వైద్యుఁడు నాడిని చూచునపుడు స్వస్థచిత్తుఁడై ఆత్మను మనస్సును శాన్తపఱచికొని రోగియొక్క దక్షిణహస్తమును తనమూఁడువేళ్ళతో పట్టిదోషములను తెలిసికొనవలయును

గ్రంథాన్తరే

శ్లో॥ ప్రాతః కృతసమాచారః కృతాచారపరిగ్రహమ్ ।
సుఖాసీనస్సుఖాసీనం పరీక్షార్థముపాచరేత్ ॥

తా॥ వైద్యుఁడు ప్రాతఃకాలమునందు స్నానసంధ్యావందనాది కృత్యములు నొనర్చుకొని పరిశుద్ధుఁడై సుఖాసీనుఁడగు రోగికడకేఁగి తానును సుఖముగఁ గూర్చుచున్నవాఁడై రోగనిదానంబు నెఱుంగవలయును.

### నాడీపరీక్షా కాలము

శ్లో॥ ఈషద్వినమ్రీకృతకూర్పరవామభాగహస్తే ప్రసారితసదం
గులిసంధికే చ। అంగుష్ఠమూలపరిపశ్చిమభాగమధ్యే నాడీం
ప్రభాతసమయే ప్రథమం పరీక్షేత్॥

తా॥ వైద్యుండుదయకాలమునందు రోగియొక్క చాచినట్టి హస్తమందుండు బొటనవ్రేలునకు వెనుకపట్టున నుండినట్టి నాడిని పరీక్షించవలయును.

### స్త్రీపురుషనాడీలక్షణము

శ్లో॥ స్త్రీణాం నాభ్యూర్ధ్వముఖః కూర్మః పుంసాం పునరధోముఖః।
అతః కూర్మవ్యతిక్రాంతాత్సర్వత్రైవ వ్యతిక్రమః।
లక్ష్యతే దక్షిణే పుంసాం యాచ నాడీవిచక్షణైః।
కూర్మభేదేన వామానాం వామే చైవావలోక్యతే॥

తా॥ స్త్రీలకు నాభికూర్మము ఊర్ధ్వముఖంబుగను పురుషులకు అధోముఖంబుగ నుండుటచే స్త్రీపురుషులకు నాడులు వ్యత్యాసముగ నుండునుగాన స్త్రీలకు ఎడమహస్తమునందును పురుషులకు కుడిహస్తమునందును నాడి పరీక్షింపవలయును.

### మతాంతరే

శ్లో॥ కరమూలే పాదమూలే నాడీ వహతి దృశ్యతామ్।
నారీణాం వామభాగే చ పుంసాం దక్షే తు శోధయేత్॥

తా॥ హస్తమూలమునందును పాదమూలమునందును నాడి సంచరించుచుండును గాన స్త్రీలకు వామహస్తమునందును పురుషులకు దక్షిణహస్తమునందును పరీక్షింపవలయును.

### గ్రంథాంతరే

శ్లో॥ ప్రాయస్స్ఫుటా భవతి వామకరే వధూనాం పుంసాం చ
దక్షిణకరే భవతీయం పరీక్షా॥

తా॥ స్త్రీలకు వామహస్తమునందును, పురుషులకు దక్షిణ హస్తమునందును నాడి స్పష్టముగ నుండును.

మతాన్తరే

శ్లో॥ వామభాగే స్త్రియా యోజ్యా నాడీ పుంసస్తు దక్షిణే ।
ఇతి ప్రోక్తం మయా దేవి సర్వదేహేషు దేహినామ్॥

తా॥ స్త్రీలకు ఎడమహస్తమునందును పురుషులకు కుడి హస్తమునందును నాడిని పరీక్షింపవలయు నని పార్వతితో పరమేశ్వరుండు వచించెను.

కేవల స్త్రీనాడీ లక్షణము

శ్లో॥ స్త్రీణాం భిషగ్వామహస్తే వామపాదే చ యత్నతః।
శాస్త్రేణ సంప్రదాయేన తథా స్వానుభవేన వై ।
పరీక్షేద్రత్నవచ్చాపి అభ్యాసాదేవ జాయతే॥

తా॥ వైద్యుఁడు స్త్రీలయొక్క యెడమహస్తము నందును, ఎడమ పాదమునందును శాస్త్ర సంప్రదాయ స్వానుభవములచే పరీక్షింపవలయును, రత్నపరీక్షాజ్ఞానము అభ్యాసమువలనఁ గలిగినట్లు నాడీపరిజ్ఞానముకూడ అభ్యాసమువలననే కలుగును.

నాడీపరీక్షా క్రమము

శ్లో॥ వారత్రయం పరీక్షేత ధృత్వా ధృత్వా విముంచయేత్ ।
విమృశ్య బహుధా బుద్ధ్యా రోగవ్యక్తిం వినిర్దిశేత్ ॥

తా॥ రోగియొక్క నాడిని పలుమారు పట్టి విడుచుచు బుద్ధిచే బాగుగ మూఁడుమార్లు పరీక్షించి రోగ మిట్టిదని నిర్దేశింపవలయును.

గ్రంథాన్తరే

శ్లో॥ అంగుళిత్రితయైః స్పృష్ట్వా క్రమాద్దోషత్రయోద్భవాః ।
మందాం మధ్యగతాం తీక్ష్ణాం త్రిభిర్దోషైస్తు లక్షయేత్ ॥

తా॥ రోగియొక్క నాడిని వైద్యుడు తనయొక్క మూఁడువ్రేళ్ళచే స్పృశించి వాతము పిత్తము కఫము వీటియొక్క గతులను క్రమముగ మంద మధ్యమధ్యమతీక్ష్ణములుగ తెలిసికొనవలయును వాతపిత్తకఫములే త్రిదోషములు వీటిని వైద్యుఁడు సూక్ష్మదృష్టిచే నెఱుంగవలయును.

### పాదగతనాడీ లక్షణము

శ్లో॥ జీవితం లాఘవం స్వాస్థ్యం జ్వరస్య చ విమోచనమ్ ।
యస్తు స్థానాన్న ముచ్యేత పాదనాడీ నిదర్శయేత్ ॥

తా॥ ఆయుస్సు శరీరలఘుత్వము శరీరస్వస్థత జ్వరవిమోచనము వీటి నెఱుంగుటకై పాదమునం దుండునాడిని పరీక్షింపవలయును.

### హస్తగత నాడీలక్షణము

శ్లో॥ తిర్యగ్యవప్రమాణేన జహాతిచ నిజం పదమ్ ।
ఘాంతికం జీవనిర్యాణం హస్తనాడీ గలేచ యా ॥

తా॥ ఏమనుజునినాడి హస్తమందుఁగాని లేక కంఠమందుగాని తిర్యగ్యవ ప్రమాణమయినను స్వస్థానమును వదలెనేని ఆమనుజుఁడు శరీరమును త్యజించునని యెఱుంగవలయును.

### హస్తనాడీ పరీక్ష

శ్లో॥ అజీర్ణం చామదోషం చ జ్వరస్యాగమనం క్షుధామ్ ।
వాతపిత్తకఫాన్ దుష్టాన్ హస్తనాడీ నిదర్శయేత్ ॥

తా॥ అజీర్ణము ఆమదోషము జ్వరాగమనము ఆఁకలి దుష్టవాతము పిత్తము శ్లేష్మము అను వీనిని హస్తనాడివలన తెలిసికొనవలయును.

### కంఠనాడీ పరీక్ష

శ్లో॥ ఆగంతుకజ్వరం తృష్ణా మాయాసం మైథునం క్లమమ్ ।
భయం శోకంచ కోపంచ కంఠనాడీ నిదర్శయేత్ ॥

తా॥ ఆగంతుకజ్వరము దప్పి ఆయాసము మైథునము బడ
ళయము శోకము కోపము అనునివి కంఠమునందుండు నాడి
చే తెలియంగవలయును.

నా సా నా డీ ప రీ క్ష

॥ మరణం జీవితం కామం నేత్రరోగం శిరోవ్యథామ్ ।
శ్రావణాన్ ముఖజాన్ రోగాన్ నాసానాడీ నిదర్శయేత్ ॥
తా॥ నాసికయందలి నాడివలన మరణము జీవితము కామము నేత్ర
రోగము శ్రవణరోగము తలనొప్పి ముఖరోగము వీటిని తెలియంగ
యును.

కాలభేదముచే నాడీసంచారక్రమము



॥ ప్రాతః శ్లేష్మయుతా నాడీ మధ్యాహ్నే చాపి పైత్తికీ ।
అపరాహ్ణే వాతకీ చ పునః పిత్త నిశార్ధకే ॥
తా॥ ప్రాతఃకాలమునందు నాడి శ్లేష్మయుక్తముగను మధ్యాహ్న
కాలమునందు పిత్తయుక్తంబుగను అపరాహ్ణంబున వాతయుక్త
ను అర్థరాత్రమందుమరల పిత్తయుక్తంబుగను నడుచుచుండును

అజ్ఞాత్య నాడీలక్షణము

॥ సద్యస్స్నాతస్య భుక్తస్య తథా స్నేహావగాహినః ।
క్షుత్తృడార్తస్య సుప్తస్య నాడీ సమ్యఙ్న బుధ్యతే ॥
తా॥ స్నానము చేసినవానికి భోజనము చేసినవానికి చమురు
ట్టొని వానికి ఆకలి దప్పి ఇవి గలవానికి నిదురఁబోవువానికినాడి
ముగ గనుపడదు.

గ్రంథాంతరే

॥ తైలాభ్యంగే చ సుప్తే చ తథా వై భోజనాంతరే ।
తథా న జ్ఞాయతే నాడీ యథా దుర్గతరా నదీ ॥

తా॥ తైలాభ్యంగ మొనర్చుకొనినవానికిని నిద్రించి మేలుకొనిన వానికిని భోజనము చేసినవానికిని నాడి అతిగంభీరముగ నడి చందంబున తెలియంబడదు.

### ధమనీనాడీలక్షణము

శ్లో॥ అంగుష్ఠమూలభాగే యా ధమనీ జీవసాక్షిణీ ।
తచ్చేష్టయా సుఖం దుఃఖం జ్ఞేయం కాయస్య పణ్డితైః ॥

తా॥ మనుష్యులయొక్క అంగుష్ఠమూలమునందు, అనగా మణికట్టునకు పెరుక మూఁడంగుళముల ప్రదేశమునందు జీవసాక్షి యని పేర్కొనంబడు ధమని యను నాడి గలదు. దానియొక్క నడకచే శరీరమునందుఁగల సుఖదుఃఖములను నాడీజ్ఞానులు తెలిసికొనియెదరు.

### జీవసాక్షి నాడీలక్షణము

శ్లో॥ అంగుష్ఠస్య తు మూలే యా సా నాడీ జీవసాక్షిణీ ।
తస్యా గతివశాద్విద్యాత్సుఖం దుఃఖఞ్చ రోగిణామ్ ॥

తా॥ అంగుష్ఠమూలమునం దుండునట్టి నాడి జీవసాక్షిణియని పేర్కొనంబడును. దాని గమనాతిశయముచే రోగియొక్క సుఖదుఃఖంబులం దెలిసికొనవలయును.

### నాడీపర్యాయశబ్దములు

శ్లో॥ స్నాయుర్నాడీ వసా హింస్రా ధమనీ ధామనీ ధరా ।
తంతుకీ జీవితజ్ఞా చ సిరా పర్యాయవాచకాః ॥

తా॥ స్నాయువు వస హింస్ర ధమని ధామని ధర తంతుకి జీవితజ్ఞ సిర ఇట్లు నాడులు తొమ్మిదివిధంబులుగ విలసిల్లును.

### నాడీదేవతలు

శ్లో॥ వాతనాడీ భవేద్బ్రహ్మా పిత్తనాడీచ శంకరః ॥
శ్లేష్మనాడీ భవేద్విష్ణు స్త్రీదేవా నాడిదేవతాః ।

తా॥ వాతపిత్తకఫనాడులకు క్రమముగ బ్రహ్మ శివ విష్ణువులు దేవతలుగా నుందురు.

### వాతాదినాడీస్థానములు వాటిగుణములు

శ్లో॥ అగ్రే వాతవహా నాడీ మధ్యే వహతి పిత్తలా ।
అంతే శ్లేష్మవికారేణ నాడీ జ్ఞేయా బుధైస్సదా ।
వాతాద్వక్రగతిర్నాడీ పిత్తాదుత్ప్లుత్యగామినీ ।
కఫాన్మందగతిర్జ్ఞేయా సన్నిపాతాదతిద్రుతమ్ ॥

తా॥ అగ్రమునందు వాతనాడి వాతము ప్రకోపముగ నుండునపుడు వంకరగా నడుచును పిత్తనాడి మధ్యమమందుండి పిత్తప్రకోపమునందు కప్పవలె నెగిరెగిరి నడుచును కఫనాడి కడపటనుండి కఫప్రకోపమగునపుడు మందముగ నడుచును. సన్నిపాతమునందు పైని జెప్పిన మూడునాడులును అతిత్వరముగా నడుచును.

### గ్రంథాన్తరే

శ్లో॥ ఆద్యా చ వహతే వాతో మధ్యే పిత్తం తథైవ చ ।
అన్తే చ వహతే శ్లేష్మ నాడీత్రయలక్షణమ్ ॥

తా॥ రోగి మణికట్టునందు తన తర్జనికి స్పృశించెడి నాడి వాతమనియు మధ్యమాంగుళికి స్పృశించెడి నాడి పిత్తమనియు అనామికాంగుళమునకు స్పృశించెడి నాడి శ్లేష్మమని యని నాడీజ్ఞులు వచించెదరు.

### వాతాదినాడీగమనక్రమము

శ్లో॥ వాతే వక్రా భవతి చపలా శ్లేష్మరోగే స్థిరా స్యా ।
త్సర్పాకారా ప్రభవతి తదా వాతపిత్తప్రభావే ।
నాడీ హంసీ కఫపవన యోర్మధ్యగా శ్లేష్మపిత్తే ।
భిన్నా నూనస్త్రిపిచ విషమగా దే సన్నిపాతే త్వలక్ష్యా ॥

తా॥ వాతరోగమునందు నాడి వక్రముగను పిత్తరోగంబునందు చపలముగను కఫరోగంబునందు స్థిరముగను నుండును. మరియు నాడి వాతపిత్త రోగంబున సర్పము తెలుంగునను శ్లేష్మవాతరోగంబున రాజహంసవలెను శ్లేష్మపిత్తరోగమునందు మండూకమువలెను విషమ జ్వరమునందు తునుకలుగను సూక్ష్మముగను సన్నిపాతమునందు అదృశ్యమై యనేక రీతులుగను నడుచును.

మతాన్తరే

శ్లో॥ తృణం పురస్సరం కృత్వా యథా వాతో నహేద్బలీ।
శేషస్థం తృణమాదాయ పృథివ్యాం వక్రగా యథా।
తథా మధ్యగతో వాయుః కృత్వా పిత్తం పురస్సరమ్।
శ్లేష్మస్థం కఫమాదాయ నాడ్యాం వహతి సర్వదా॥

వాక్య॥ అ ఏవ పిత్తస్య చంచలా గతిర్వాయోరగ్రత్వాత్।
కఫస్య మన్థా గతిర్వాయుపృష్ఠత్వాత్॥

తా॥ గాలి వీచునపుడు దాని కెదురుగ నుండు తృణము త్వరితంబుగను వెనుకనుండు తృణము హీనంబుగను నడుచునట్లైనడి మధ్యమాంగుళియందు స్పృశించు వాతము తర్జనియందు స్పృశించు పిత్తమును విశేషముగ చలింపఁజేయుటయే గాక అనామికయందుండెడి శ్లేష్మమును సయితము మందముగ చలింపఁజేయును.

గ్రంథాన్తరే

శ్లో॥ పిత్తశ్లేష్మగతిర్నాస్తి వాతస్య గమనే గతిః।
తస్మాత్త్వగ్రే వహేద్వాయుర్జలూకా వక్రగా యథా॥

తా॥ పిత్తశ్లేష్మనాడులు స్వాతంత్ర్యరాహిత్యములుగ నుండుటచే వాతనాడి గతి ననుసరించే పిత్తశ్లేష్మములకు గతి కలిగియుండుగాన, వక్రముగ నడుచు జలగచందంబుగ నాడుకు అగ్రమునందుండెడి వాతనాడి చలించనేని పిత్తశ్లేష్మములుకూడ చలించును.

### ఆరోగ్యనాడీ లక్షణము

శ్లో॥ హంసగా చైవ యా నాడీ తథైవ గజగామినీ।
ముఖం ప్రసన్నంచ భవేత్తస్యారోగ్యం భవేత్సదా॥

తా॥ నాడి హంసయొక్కయు, ఏనుఁగయొక్కయు నడకగలిగి ముఖము ప్రసన్నముగ నుండిన అట్టిరోగికి ఆరోగ్యము గలుగును.

### గ్రంథాన్తరే

శ్లో॥ భూలతా భుజగప్రాయా స్వచ్ఛా స్వాస్థ్యమయీ సిరా।
సుఖితస్య స్థితా జ్ఞేయా తథా బలవతీ మతా॥

తా॥ నిరోగియొక్క నాడి భూతలమునంబడునది సర్పమువలె రంబుగను బలిష్ఠముగను నడచును.

### మతాన్తరే

శ్లో॥ యో రోగిణః కరం స్పృష్ట్వా స్వకరం ఘ్రాణయేద్యది।
రోగాస్తస్య వినశ్యంతి పంకః ప్రక్షాళనాద్యథా॥

తా॥ రోగియొక్క నాడిని వైద్యుఁడు చూచి తన హస్తము నుమగుకొన్నయెడల, ఆరోగియొక్క వ్యాధులు నశించును.

### వాతనాడీలక్షణము

శ్లో॥ సర్పజలూకాదిగతిం వదన్తి విబుధాః ప్రభంజనే నాడీమ్॥

తా॥ వాతరోగమునందు నాడి సర్పము జెలగ వీటిగతిచందంబున నడచును.

### పిత్తనాడీ లక్షణము

శ్లో॥ పిత్తేచ కాకలావకమండూకాదేస్తథా చపలామ్॥

తా॥ పిత్తరోగమునందు నాడి కాకి లావుకము కప్ప వీటియొక్కవంటి గతిగలదిగ నుండును.

### కఫరోగనాడీలక్షణము

శ్లో॥ రాజహంసమయూరాణాం పారావత కపోతయోః ।
కుక్కుటస్య గతిం ధత్తే ధమనీ కఫసంగినీ ।
పిత్తేవ్యక్తా మధ్యమాయాం తృతీయాంగుళికా కఫే ।
వాతేఽధికే భవేన్నాడీ ప్రవ్యక్తా తర్జనీతలే ॥

తా॥ శ్లేష్మరోగమునందు నాడి రాజహంసము నెమలి పావురము గువ్వ కోడి వీటియొక్క గమనము గలిగియుండును. మరియు పిత్తనాడి నడిమివ్రేలి క్రిందను శ్లేష్మనాడి అనామిక క్రిందను వాతనాడి తర్జనివ్రేలిక్రిందను నడుచును.

### వాతపిత్తనాడీ లక్షణము

శ్లో॥ ముహుస్సర్పగతిం నాడీ ముహుర్భేకగతిం తథా ।
తర్జనీమధ్యమామధ్యే వాతపిత్తేఽధికే స్ఫుటా ।
వక్రముత్ప్లుత్య చలతి ధమనీ వాతపిత్తతః ॥

తా॥ వాతపిత్తప్రకోపమునందు నాడి తర్జనీమధ్యమాంగుళముల మధ్యమునందు మాటిమాటికి సర్పము కప్పవీటియొక్క నడకతో త్వరమై వక్రముగ ఎగిరెగిరి నడుచుచుండును.

### వాతశ్లేష్మనాడీలక్షణము

శ్లో॥ సర్పహంసగతిం తద్వద్వాతశ్లేష్మవతీం వదేత్ ।
అనామికాయాం తర్జన్యాం వ్యక్తా వాతకఫే భవేత్ ।
వహేద్వక్రంచ మందంచ వాతశ్లేష్మాధికత్వతః ॥

తా॥ అనామికయందును తర్జనియందును స్ఫుటముగా కనపడును సర్ప హంస గతులుగలిగి మందముగను వక్రముగను నడుచునట్టి నాడి వాతశ్లేష్మ నాడియని చెప్పవలయును.

గ్రంథాన్తరే

శ్లో॥ భుజగాదిగతి_స్తస్యా రాజహంసగతి_స్తథా।
వాతశ్లేష్మద్వయోద్భూతాం భాష_న్తే తద్విదో జనాః।

తా॥ వాతశ్లేష్మనాడి సర్పము హంస పీటిగతితో తుల్యగతి గలదిగ నుండును.

పిత్తశ్లేష్మనాడి లక్షణము

శ్లో॥ హారిహంసగతిం ధ_త్తే పిత్తశ్లేష్మాన్వితా ధరా।
మధ్యమానామికామధ్యే స్ఫుటా పిత్తకఫేఽధికే।
ఊర్ధ్వోత్ప్లుత్య మందం చలతి నాడీ పిత్తకఫేఽధికే॥

తా॥ నాడి కప్ప హంస పీటిగతితో తుల్యగతిగలిగి మధ్యమానామికలయొక్క మధ్యమందు సంచరించుచు ఎగిరెగిరి మందముగా నడిచిన పిత్తశ్లేష్మనాడి యని తెలియవలయును.

గ్రంథాన్తరే

శ్లో॥ మండూకాదిగతిం నాడీం మయూరాదిగతిం ధరామ్।
పిత్తశ్లేష్మసముద్భూతాం ప్రవద_న్తి మనీషిణః।
సూక్ష్మా శీతా స్థిరా నాడీ పిత్తశ్లేష్మసముద్భవా॥

తా॥ నాడి మండూకము నెమలి యని మొదలగువాటిగతి తెలుంగున సంచరించుటయే కాక సూక్ష్మంబుగను శీతలంబుగను నుండు నది పిత్తశ్లేష్మనాడి యని యెఱుంగవలయును

సన్నిపాత నాడీలక్షణము

శ్లో॥ కాష్ఠకుట్టో యథా కాష్ఠం కుట్టతే చాతివేగతః।
స్థిత్వాస్థిత్వా తథా నాడీ సన్నిపాతే భవేద్ధ్రువమ్।
అంగుళిత్రితయేఽపి స్యాత్ప్రవ్యక్తా సన్నిపాతతః॥

తా॥ వృక్షమును తొలుచునట్టి పిట్ట అనఁగా లకుముకిపిట్ట వృక్షమును అతివేగముగా నిలిచి నిలిచి యెట్లు కొట్టునో అట్లే రీతిగ నిలిచి నిలిచి మూఁడువేళ్ల క్రింద నడుచుచు స్ఫుటముగ నుండునది సన్నిపాతనాడి యని యెఱుంగవలయును.

గ్రంథాంతరే

శ్లో॥ లావతిత్తిరి వర్తీగమనం సన్నిపాతతః ।
కదాచిన్మందగా నాడీ కదాచిచ్ఛీఘ్రగా భవేత్ ।
త్రిదోషప్రభవే రోగే విజ్ఞేయా చ భిషగ్వరైః ॥

తా॥ త్రిదోషమిళితంబగు నాడి లావుకపిట్ట తిత్తిరిపక్షి మీనవల్లంకిపిట్ట వీటివలె నడచుటయే కాక ఒకసమయంబున మందగతిగను మఱియొక సమయంబున శీఘ్రగతిగను నడచునది సన్నిపాతమని యెఱుంగవలయును.

అసాధ్య నాడీలక్షణము

శ్లో॥ మందంమందం శిథిలశిథిలం వ్యాకులం వ్యాకులం వా ।
స్థిత్వా స్థిత్వా వహతి ధమనీ యాతి సూక్ష్మాచ సూక్ష్మా ।
నిత్యం స్వస్థానేస్స్ఖలతి పునరప్యంగుళీం సంస్పృశేద్వా ।
భావైరేవం బహువిధవిధైస్సన్నిపాతాదసాధ్యా ॥

తా॥ నాడి మందముగను మిక్కిలి శిథిలముగను అతిచంచలముగను నిలిచి నిలిచియును దృశ్యాదృశ్యముగను నుండిన యెడల నది సన్నిపాతరోగమనియు అసాధ్యమనియును ఎఱుంగవలయును.

గ్రంథాంతరే

శ్లో॥ యాత్యుచ్ఛ్రితా స్థిరాత్యన్తా యా చేయం మాంసవాహినీ ।
యా చ సూక్ష్మా చ వక్రా చ తామసాధ్యాం విదుర్బుధాః ॥

తా॥ నాడి అతివేగంబుగ నెగురుచును మిగుల స్థిరంబుగను మాంససంచారిగను అతిసూక్ష్మంబుగను అతివంకరగను నుండెనేని అది యసాధ్యంబని యెఱుంగవలయును.

మతాంతరే

శ్లో॥ స్పందతే చైకమానేన త్రింశద్వారం యదా ధరా ।
స్వస్థానేన తదా నూనం రోగీ జీవతి నాన్యథా ।
స్థిత్వాస్థిత్వా చలతి యా సా స్మృతా ప్రాణఘాతినీ ॥

తా॥ ఏరోగియొక్క నాడి ఏకగతిగ ముప్పది త్రుటికాలములు నడిచిన ఆరోగి జీవించును ఏ నాడి నిలిచి నిలిచి ఆడేరీతిగ నడిచిన యెడల అట్టిరోగి మరణించును.

గ్రంథాంతరే

శ్లో॥ మహాదాహేపి శీతత్వం శీతత్వే తాపితా సిరా ।
నానావిధా గతిర్యస్య తస్య మృత్యుర్న సంశయః ॥

తా॥ ఏమనుజునికి అత్యుష్ణంబుగ నుండుకాలంబున అతిశీతంబుగను అతిశీతలంబుగ నుండుకాలంబున అతితాపంబుగను నానావిధ గతులు గలదిగ నాడి సంచరించెనేని అట్టివాఁడు మృత్యువగును.

మతాంతరే

శ్లో॥ పూర్వం పిత్తగతిం ప్రభంజనగతిం శ్లేష్మాణమాబిభ్రతీం ।
స్వస్థానాద్భ్రమణం ముహుర్విదధతీం చక్రాధిరూఢేవ యా ।
తీవ్రత్వం దధతీ కదాచిదపి యా సూక్ష్మత్వమాతన్వతీ ।
నో సాధ్యాం ధమనీం వదంతి మునయో నాడీగతిజ్ఞానినః ॥

తా॥ ఏరోగియొక్క నాడి మందగతిని పొంది నడుచుచుమధ్య మాంగుళియందు వాతశ్లేష్మములయొక్క గతులను పొంది మాటి మాటికి అనేకవిధములుగ చక్రముమీఁదఁ గూర్చున్నవాఁడట్లు తిరుగుచో అట్లు స్వస్థానమును విడిచి అంతలోనే భయంకరమును పొంది యొకప్పుడు సూక్ష్మత్వమును పొందిన అట్టిరోగి బ్రతుకఁడని నాడీజ్ఞానులగు మునులు వచించిరి.

గ్రంథాన్తరే

శ్లో॥ త్రిదోషే. స్పందతే నాడీ మృత్యుకాలేచ నిశ్చలా ।
జ్ఞేయా సర్వవికారేషు వైద్యైః కుశలకర్మభిః॥

తా॥ త్రిదోషనాడి సర్వదా సంచరించుచు మృత్యుకాల మాసన్నంబైన కాలంబున నిశ్చలంబుగ నుండును. ఇట్టి భేదంబులను సర్వసన్నిపాతంబులయందును నెఱుంగవలయును.

మతాన్తరే

శ్లో॥ తస్య మృత్యుం విజానీయాద్యస్యేదం నాడిలక్షణమ్ ॥

తా॥ ఈపైని జెప్పంబడిన నాడి ఏమనుజునికిఁ గలిగియుఁ డునో ఆ మనుజుఁడు యమపురంబున కేగును.

గ్రంథాన్తరే

శ్లో॥ కంపతే స్పందతేఽత్యంత పునస్స్పృశతి చాంగుళీ ।
తామసాధ్యాం విజానీయాన్నాడీం దూరేణ వర్జయేత్ ॥

తా॥ నాడియొకప్పుడు మిక్కిలి వణఁకుచును ఒక్కప్పుడు కొద్దిగా కదలుచును వ్రేలిలోనే కనుపడకయు, మరల కనుపడుచును ఉండిన యెడల వైద్యుఁడు అట్టిరోగ మసాధ్యమని యెంచి దూరముగ వదలుకొనవలయును.

మతాన్తరే

శ్లో॥ అతిసూక్ష్మాతివేగాచ శీతలాచ భవేద్యది ।
తదా వైద్యో విజానీయాత్స రోగీ త్వాయుషః క్షయా ।

తా॥ ఏరోగియొక్క నాడి అతిసూక్ష్మముగను అతివేగముగను శీతలముగను నడిచిన అట్టిరోగి క్షీణాయుష్యయు గలవాఁడని యెఱుఁగవలయును.

గ్రంథాన్తరే

శ్లో॥ విద్యుద్వద్రోగిణో నాడీ దృశ్యతే నచ దృశ్యతే।
అకాలవిద్యుత్పాతేవ స గచ్ఛేద్యమసాదనమ్॥

తా॥ ఏరోగియొక్క నాడి మెఱుపువలె కనుపడి కనుపడక యుండినను అకాలమునందలి మెఱుపువలె నుండునో అట్టిరోగి యముని సదనంబున కేగును.

మతాన్తరే

శ్లో॥ తిర్యగుష్ణా చ యా నాడీ సర్పగా వేగవత్తరా।
కఫపూరితకంఠస్య జీవితం తస్య దుర్లభమ్॥

తా॥ ఏరోగియొక్క నాడి వెచ్చనై వంకరగా నడుచుచు సర్పగతిగలిగి మిక్కిలి వేగముగ నడుచుచు కంఠమునందు కఫము పూరించి యుండినయెడల అట్టిరోగి యమమందిరంబున కేగును.

గ్రంథాన్తరే

శ్లో॥ దృశ్యతే చరణే నాడీ కరే నైవాభిదృశ్యతే।
ముఖం వికాసితం యస్య తం దూరం పరివర్జయేత్॥

తా॥ ఏరోగియొక్క నాడి పాదమునందు కనుపడుచును హస్తమునందు కనుపడక ముఖము వికాసముగ నుండినయెడల అట్టిరోగి యమపురంబున కేగునని యెఱింగి వైద్యుండు వానిని విడువవలయును.

మతాన్తరే

శ్లో॥ వాతపిత్తకఫాశ్చాపి త్రయో యస్యాం సమాశ్రితాః।
కృచ్ఛ్రసాధ్యా మసాధ్యాంవా ప్రాహుర్వైద్యవిశారదాః॥

తా॥ ఏరోగియొక్క నాడిని వాత పిత్త కఫములు ఆశ్రయించి యుండిన ఆరోగియొక్క రోగ మసాధ్యమనియు లేక కష్టసాధ్యమనియు వైద్యవేత్తలు వచించిరి.

### మాసాంతమృత్యు నాడీలక్షణము

శ్లో॥ ధూలతా భుజగాకారా నాడీ దేహస్య సంక్రమాత్ ।
విశీర్ణే శీఘ్రతాం యాతి మాసాంతే మరణం ధ్రువమ్ ॥

తా॥ నాడి సర్పాకారముగ దేహమంతయు వ్యాపించి శిథిలముగ జీర్ణంబుగను నుండిన నట్టివాడు మాసాంత్యమునందు మృతుడగును.

### అర్ధమాసమృత్యు నాడీలక్షణము

శ్లో॥ దేహే శైత్యం ముఖే శ్వాసో నాడీ తీవ్రా విదాహినీ ।
మాసార్ధం జీవితం తస్య నాడీవిజ్ఞాన్ప్రభాషితమ్ ॥

తా॥ ఏరోగియొక్క దేహమందు శైత్యము ముఖమునందు విశేషముగ శ్వాసము కలిగి నాడి తీవ్రముగను మిగుల దాహముయుక్తముగ నడచుచేని అట్టిరోగి మాసార్ధము జీవించునని నాడీజ్ఞానులు వచించిరి.

### సప్తదినమృత్యు నాడీ లక్షణము

శ్లో॥ ముఖే నాడీ వహేత్తీవ్రా కదాచిచ్ఛీతలా వహేత్ ।
ఆయాతి పిచ్ఛిలః స్వేదః సప్తరాత్రం న జీవతి ॥

తా॥ వాతనాడి మిక్కిలి తీవ్రగతి కలిగియుండినను ఒకప్పుడు శీతలముగ నుండిన శరీరమునకు బంకగా చెమటపట్టినను అట్టిరోగి యేడు దినంబులలో మృతి నొందును.

### గ్రంథాంతరే

శ్లో॥ క్షణాద్గచ్ఛతి వేగేన శాంతతాం లభతే క్షణాత్ ।
సప్తాహాన్మరణం తస్య యద్యంగే శోఫవర్జితః ॥

తా॥ ఏమనుజునియొక్క నాడి స్వస్థానము వదలి క్షణకాలము తీవ్రంబుగను క్షణకాలము శాంతంబుగను నడచుచు శరీరము శోఫవర్జితముగ నుండినను అట్టి మనుజుడేడుదినంబులకు మృతిజెందును

## ఐదవదినమృత్యునాడీ లక్షణము

శ్లో॥ పాదాఙ్గుళిగతా నాడీ మన్దమన్దా యదా భవేత్ ।
పంచభిర్దివసైస్తస్య మృత్యుర్భవతి నాన్యథా ॥

తా॥ ఏమనుజునియొక్క పాదాఙ్గుష్ఠమును జెందియుండు నాడి మన్దమన్దముగ నడుచునో అట్టిమనుజుఁ డైదుదినంబులలో వైవస్వతపురంబున కేగును.

## చతుర్థదివసమృత్యునాడీ లక్షణము

శ్లో॥ పాదాంగుళిగతా నాడీ కోష్ణా వేగవతీ భవేత్ ।
చతుర్భిర్దివసైస్తస్య మృత్యురేవ నసంశయః ॥

తా॥ ఏమనుజునియొక్క నాడి పాదాంగుళిగతంబై కించిదుష్ణము గూడి యతివేగంబుగ నడుచుచుండునో అట్టిమనుజుఁ డస్తమితత్వమును జెందును.

## మతాన్తరే

శ్లో॥ నిరీక్ష్య దక్షిణే పాదే నాడీమేకాం విశేషతః ।
ముఖే నాడీం వహేన్నిత్యం తదా దినచతుష్టయమ్ ॥

తా॥ ఏమనుజునికి కుడిపాదంబునన్నొక నాడి యతితీవ్రంబుగ నడుచుచుండుటయేగాక ముఖంబునయందు నొకనాడి నడుచుచుండెనేని అట్టిమనుజుఁడు నాలవ దివసంబున మృతుండగును.

## త్రిరాత్రమృత్యునాడీలక్షణము

శ్లో॥ ముఖే నాడీ యదా నాస్తి మధ్యే శైత్యం బహిః క్లమః ।
యదా మన్దా వహేన్నాడీ త్రిరాత్రం నైవ జీవతి ॥

తా॥ వాతనాడి కదలక లోపల చల్లగనుండి పైన నాడి మిక్కిలి మందముగ నడచిన నట్టిరోగి మూఁడుదినంబులలో మృతిని జెందును.

గ్రంథాంతరే

శ్లో॥ హిమవచ్ఛీతలా నాడీ జ్వరదాహేన తాపినామ్ ।
త్రిదోషస్పర్శం భజతాం తదా మృత్యుర్దినత్రయాత్ ॥

తా॥ ఏమనుజునికి అత్యంత ప్రకారంబులు జ్వరము గలిగి యుండి నప్పుడు నాడి మంచువలె శీతలముగ నుండుట యేగాక త్రిదోష స్పర్శ సంబంధము గలిగియుండు నేని అట్టిమనుజుండు మూఁడుదివసంబులలో మృత్యువు పాలగును.

మతాంతరే

శ్లో॥ పాదాంగుళగతా నాడీ చంచలా యది గచ్ఛతి ।
త్రిభిశ్చ దివసైస్తస్య మృత్యురేవ నసంశయః ॥

తా॥ ఏమనుజునికి పాదాంగుష్ఠతలంబగు నాడి మిగుల చలనంబు గలుగుచుండునో అట్టినరుండు మూఁడుదినంబులలో సూర్యనందనుని పురంబున కేగును.

ద్వితీయదివసమృత్యునాడీలక్షణము

శ్లో॥ శీఘ్రా నాడీ మలోపేతా శీతలా వాథ దృశ్యతే ।
ద్వితీయే దివసే మృత్యుర్నాడీవిజ్ఞానభాషితమ్ ॥

తా॥ ఏరోగియొక్క నాడి మలోపేతముగను శీఘ్రగతిగలి యును శీతలముగను గనుపడిన యెడల అట్టిరోగి రెండవదినంబు యమునాగ్రజునిసదనంబున కేగును.

గ్రంథాంతరే

శ్లో॥ స్థిరా నాడీ భవేద్యస్య విద్యుద్ద్యుతిరివేక్షతే ।
దినైకం జీవితం తస్య ద్వితీయే మృత్యురేవ చ ॥

తా॥ ఏరోగియొక్క నాడి చాలకాలము స్థిరముగ నుండి మెఱుపు వలె తళుక్కుమని కనుపడి కనుపడక యుండునో అట్టిమనుజుం డొక దినము జీవించి రెండవ దినంబున దండధరుని చెంతఁ జేరును.

### అన్యచ్చ

శ్లో॥ శీఘ్రానాడీ మలోపేతా మధ్యాహ్నేఽగ్నిసమో జ్వరః।
దినైకం జీవితం తస్య ద్వితీయేఽహ్ని మ్రియేత సః॥

తా॥ ఏరోగియొక్క త్రిదోషనాడి మలయుక్తమై శీఘ్రముగ నడచుచు మధ్యాహ్నకాలమందు అగ్నితుల్యముగ జ్వరము వచ్చిన యెడల అట్టిరోగి మఱుదినమున మార్తాండనందనుని గృహంబున కేగును.

### గ్రంథాన్తరే

శ్లో॥ స్థిత్వా నాడీ ముఖే యస్య విద్యుజ్జ్యోతిరివేక్షతే।
దినైకం జీవితం తస్య ద్వితీయే మరణం ధ్రువమ్॥

తా॥ ఏమనుజునియొక్క నాడి ముఖంబున నిలిచి నిలిచి వర్షఋతువునందు మెఱుపుమెఱయుచు తోఁచుగున మిగుల తీవ్రగతిగలిగియుండెనేని అట్టివాఁడు ఒకదినంబు జీవించి మఱుదినంబున వైవస్వతాలయంబున కేగును.

### ద్వాదశయామమృత్యు నాడీలక్షణము

శ్లో॥ గతిం భ్రమరకస్యేవ వహేద్యది దినేన తు।
స్కంధేచ స్పందతే నిత్యం పునర్గచ్ఛతి చాంగులౌ॥
మధ్యే ద్వాదశయామానాం మృత్యురేవ న సంశయః॥

తా॥ ఏమనుజునియొక్క నాడి తుమ్మెదవలె ఝుమ్మని పలుకుచును భుజములయందును చలించుచును అంగుళములయందు చలింపకయుండునో అట్టిమనుజుఁడు పండ్రెండుయామములలోపల శ్యామలాతిపురంబున కేగును.

### దినాష్టమృత్యునాడీలక్షణము

శ్లో॥ మరణే దమరు ... భవేదేకదినేన చ॥

తా॥ దినాంతమునందు మరణము గలిగెడు మనుజునికి నాడి డమరుకమునవలె నుండును.

ఆఱవయామమృత్యు నాడీలక్షణము

శ్లో॥ మధ్యే రేఖాసమా నాడీ యది తిష్ఠతి నిశ్చలా ।
షష్ఠిస్తు ప్రహరైస్తస్య మృత్యుర్జ్ఞేయో విచక్షణైః ॥

తా॥ ఏమనుజునియొక్క అంగుష్ఠమూలమందుండు నాడు లన్నియు మధ్యమాంగుళియందు రేఖాసమంబుగ నుండుటయే గాక నిశ్చలంబుగ నుండునో అట్టిమనుజుఁడు ఆఱుయామంబులలో మృత్యుఁడగును.

సార్ధయామమృత్యునాడీలక్షణము

శ్లో॥ ద్వ్యంగుళా బాహ్యతో నాడీ మధ్యే రేఖా బహిః స్థితా ।
సార్ధప్రహరకాన్మృత్యుర్జ్ఞాయతే నాత్ర సంశయః ॥

తా॥ ఏపురుషునియొక్క నాడి తర్జనీమధ్యమాంగుళములను వదలి అనామికయందు మాత్రము సంచరించుచు దానిక్రింద రేఖాకారంబుగ స్పృశింపుచు నుండునో అట్టివాఁడొకటిన్నర యామములో మృత్యువు పొందును.

అర్ధయామమృత్యునాడీ లక్షణము

శ్లో॥ చలా చలితవేగా చ నాడీ శ్వాసాధారసంయుతా ।
శీతలా దృశ్యతే యా చ యామమధ్యే చ మృత్యుదా ॥

తా॥ ఏరోగియొక్క నాడి ముక్కులయొక్క శ్వాసోచ్ఛ్వాసముల ఆధారముతో గూడినదై వేగముగను చంచలముగను శీతలముగ నుండెనేని అట్టిరోగి ఒకయామము లోపల మరణమును జెందును.

### గ్రంథాన్తరే

శ్లో॥ అంగుష్ఠమూలతో బాహ్యే ద్వ్యంగులే యది నాడికా।
ప్రభాతార్ధాద్బహిర్మృత్యుం జానీయాచ్చ విచక్షణః॥

తా॥ అంగుష్ఠమూలమునం దుండునాడు ఆస్థానంబును వదలి
రెండంగుళములను క్రిందుగా మధ్యమానాడికలయందు నడుచుచుండె
ని అట్టివాఁ డర్ధయామము పోవల చచ్చునుపాట్లుదబంబున కేగును.

### భూతజ్వరనాడీలక్షణము




శ్లో॥ తథా భూతాభిషంగే హి త్రిదోషవదుపస్థితా।
సమాంగా వహతే నాడీ తథా నచ ప్రకంపితా॥

తా॥ భూతాభిషంగము గలవానినాడి త్రిదోషనాడివలె వాత
పిత్తశ్లేష్మంబులు సంకలితమయి సమానంబుగ నడుచుచుండును

### రోగరహితాపమృత్యునాడీలక్షణము

శ్లో॥ అపమృత్యోర్న రోగాచ్చ నాడీ తన్నిపాతవత్।

తా॥ రోగరహితుఁడై అపమృత్యువును గాంచెడువానినాడి
సన్నిపాతనాడివలె నుండును.

### దుష్టపిత్తనాడీలక్షణమ్

శ్లో॥ ప్రోక్తం వాతకఫం దుష్టం పిత్తం వహతి దారుణమ్।
పిత్తస్థానం విజానీయాద్భేషజం తస్య కారయేత్॥

తా॥ ఏమనుజునికి వాతశ్లేష్మనాడులు మిగుల అల్పంబుగను
పిత్తనాడి అతిదారుణంబుగను నడుచుచుండెనేని అది దుష్టపిత్తమని
యెఱింగి వైద్యుఁడు చికిత్సఁ జేయవలయును.

### సదోష నిర్దోషనాడీలక్షణమ్

శ్లో॥ నాడీ యథా వాతగతిస్త్రయాణాం ప్రకోపశాన్త్యాదిభిరేవ
భూయః। వాతాదిదోషేచ సమేత్యరోపా స్థానేఽల్పగా
పాకనివృత్తే స్యాత్॥

తా॥ నాడి సదాహారపిత్తశ్లేష్మయుక్తంబుగ నుండును, మఱి యునది వాతాది రోగంబులయందు ప్రకోపంబుగను నీరోగంబు శాంతత్వమును బొంది యథారీతిగను వాతాదిదోషంబున రోగయు మయి ప్రకోపంబుగను పాకాది బద్ధంబున స్థూలంబుగను అల్పంబుగను నడుచుచుండును.

## జ్వరదాహ సన్నిపాత నాడీలక్షణము

శ్లో॥ ప్లవప్రబలతాం యాతి జ్వరదాహాభిభూతయే ।
సాన్నిపాతికరూపేణ భవన్తి సర్వవేదనాః ॥

తా॥ నాడి సన్నిపాతతుల్యముగ మిగుల తాపయుక్త జ్వరము గలరోగికి మిక్కిలి చిరుత పడియుచు నడుచుచుండుటయే కాక పైన దాహారింపఁబడు చిహ్నములు గల జ్వరము దాహము ఇవి సన్నిపాతంబున జనించెనేని యనేక వేదనలం గలుగంజేయును.

## జ్వరప్రకోపనాడీ లక్షణము

శ్లో॥ జ్వర ప్రకోపే ధమనీ సోష్ణా వేగవతీ భవేత్ ॥

తా॥ నాడి జ్వరప్రకోపమునందు ఉష్ణముగను అతివేగముగను నడుచుచుండును.

## మలాజీర్ణశ్లేష్మదోష నాడీలక్షణము

శ్లో॥ మలాజీర్ణేన నితరాం స్పన్దనం పరికీర్తితమ్ ।
నాడీ తన్తుసమా మన్దా శీతలా శ్లేష్మదోషజా ॥

తా॥ నాడి మలాధిక్యము అజీర్ణము వీనియందు మన్దముగ చలించుచుండును. మఱియు నాడి శ్లేష్మాధిక్యంబున శీతలముగను తంతుసదృశంబుగను మందముగ నుండును.

## వాతపిత్తము శ్లేష్మవాతములనాడీలక్షణము

శ్లో॥ చంచలా తరలా స్థూలా కఠినా వాతపిత్తజా ।
ఈషచ్చ దృశ్యతే తూష్ణా మన్దా స్యాచ్ఛ్లేష్మవాతజా ॥

తా॥ వాతపిత్తరోగంబున చంచలముగను ప్రకాశముగను
లముగను కఠినముగను నడుచుచుండును. మఱియు శ్లేష్మవాద
గంబున నాడి కించిదుష్ణముగను మందముగను నడుచుచుండును.

### అల్పశ్లేష్మము ప్రబలవాతము ఉష్ణవాతము,
### వీటినాడీలక్షణము

శ్లో॥ నిరంతరం ఖరం రూక్షం మన్దశ్లేష్మాతివాతలా ।
రూక్షవాతా భవేత్తస్య నాడీ స్యాత్పిండసన్నిభా ॥

తా॥ నాడి అల్పశ్లేష్మరోగమునందును ప్రబల వాతరోగము
నందును నిరంతరము తీక్ష్ణంబుగను ఉష్ణముగను నడుచుచుండును.
మఱియు నాడి ఉష్ణవాతమునందు పిండమువలె నడుచుచుండును.

### సహజవాతము తీవ్రవాతము వీనియొక్క లక్షణము

శ్లో॥ సౌమ్యా సూక్ష్మా స్థిరా నాడీ సహజవాతజా ।
స్థూలా చ కఠినా శీఘ్రా స్పందతే తీవ్రమారుతే ॥

తా॥ ఏమనుజునికి సౌమ్యంబుగను సూక్ష్మముగను స్థిరముగను
మందముగను స్థూలముగను శీఘ్రముగను నాడి నడిచెనేని అది తీవ్ర
వాతంబని యెఱుంగవలయును.

### దుష్టరక్తనాడీలక్షణము

శ్లో॥ మధ్యే కరే మహీన్నాడీ యది సన్తప్తి తాధ్రువమ్ ।
తదా నూనం మనుష్యాణాం రుధిరాపూరితా మలాః ॥

తా॥ దుష్టరక్తము శరీరమందు వృద్ధిపొందెనేని యారక్తము
పచ్యమానాశయమునందలి మలంబుతోఁజేరి సంతాపయుక్తమయి
మధ్యహస్తంబున చలించుచుండును.

### భూతజ్వర ఏకాహికజ్వర విషమజ్వర నాడీలక్షణము

శ్లో॥ భూతజ్వరే సికఇవాతివేగా ధావన్తి సద్యోహి యథాబ్ధిగామీ
ఏకాహికేన క్వచన ప్రయాతే క్షణాంతగామీ విషమజ్వరేణ

తా॥ భూతజ్వరమునందలినాడి సముద్రగామిను అగునదులచందంబున నతివేగంబుగను మఱియు ఏకాహికజ్వరము విషమజ్వరః వీనియందు నాడి కొంతకాలం బతివేగంబుగను నిలిచి నిలిచియు జరుచుండును

### ద్వ్యాహిక త్ర్యాహిక చాతుర్థికజ్వర నాడీలక్షణము

శ్లో॥ ద్వితీయకే చాథ తృతీయతుర్య
యోర్గచ్ఛన్తి తప్తాభ్రమివ క్రమేణ॥

తా॥ నాడి ద్వ్యాహికము త్ర్యాహికము చాతుర్థికము వీనియందు మిగుల ఉష్ణంబులోఁ గూడి తమ్మిదవలెఁ జనుచునుండును.

### అజీర్ణనాడీలక్షణము

శ్లో॥ అజీర్ణేతు భవేన్నాడీ కఠినా పరితో జడా।
ప్రసన్నాతు ద్రుతా శుద్ధ త్వరితాచ ప్రవర్తతే॥

తా॥ నాడి అజీర్ణంబున కఠినంబుగను సర్వత్ర జడముగను అశుద్ధముగను వేగముగను నడుచుచుండును.

### మన్దాగ్నినాడీలక్షణము

శ్లో॥ మన్దాగ్నౌ క్షీణతాం యాతి నాడీ హంసాకృతి స్తథా॥

తా॥ మందాగ్ని గలవాని నాడి క్షీణంబై హంసవలె నడుచుచుండును.

## దీప్తాగ్నినాడీలక్షణము

శ్లో॥ లఘ్వీ వహతి దీప్తాగ్నేస్తథా వేగవతీ స్మృతా ॥

తా॥ దీప్తాగ్నియందు నాడి లఘువుగను వేగముగను నడుచుచుండును.

## అగ్ని మాంద్యము గ్రహణి వీనియొక్క నాడిలక్షణము

శ్లో॥ పాదేచ హంసగమనా కరే మణ్డూకసంప్లవా ।
తస్యాగ్నేర్మందతా దేహే వ్యథవా గ్రహణీగదః ॥

తా॥ అగ్నిమాంద్యము గ్రహణీరోగము వీనియందు నాడి పాదంబున హంసవలెను హస్తమున కప్పవలెను నడుచుచుండును.

నాడీనిర్ణయము
సంపూర్ణము.



ఎల్. వి. ప్రెస్, మదరాసు-1—1969

# కళాభానువిజయము

అను చక్కని శృంగార నవల

ఈ నవలను ప్రతి స్త్రీ పురుషులు బాలురందరును జదివి వి
షయమును సులభముగా గ్రహించునట్లు తేట తెనుఁగు మాటలతో
వ్రాయఁబడినది.

ఈ కాలమునం దనేక నవలలు వెలువడియున్నవి కదా! వా
నన్నింటిని జదువరులు చూచియే యుందురు ఐనను ఈ నవలతో
సమమగు నవల యింతవఱకేదియును వెలువడి యుండలేదని నొక్కి
చెప్పవలయును ఏలయనఁగా ఈ కథానాయకుఁడగు కళాభానుని
శౌర్యధైర్యగాంభీర్యౌదార్య తేజోమహిమాతిశయంబులును కథా
నాయిక యగు భువనమోహిని పాతివ్రత్య పరమ ?ణికత్వము
నెంతయు గొనియాడఁదగినవి (కళాభానునకు వసుంధరుఁడను నామాం
తరము గలదు) భేండాభైరవుని పూజాధురంధరత్వము గాని ప్రతా
పమును బొగడఁదగినవి బేతాళుని భేండాభైరవుఁడు బంధించుటయు
కళాభానుఁడు పరనారాయణానుగ్రహము బొంది భేండాభైరవుని
గాని యనుచరులను సహా సంహరించి యదివఱకు భేండాభైరవుఁడు
చెఱగొనియున్న భువనమోహినియున్నగు స్త్రీలను బురుషులను జెఱ
విడిపించి బేతాళుని బంధవిముక్తి జేయుటయు మొదలగు ఘట్టము
లతివర్ణనీయములు ఇందు బేతాళుని మహోపాయము లద్భుతముగ
నుండును వేయేల? మొత్తముమీఁద యీ నవల నవరసాలంకార
యుక్తమై చదువరుల మనస్సునకు సానందము గలిగించి కడపటకు దీని
జదివినఁగాని తృప్తియుండదనిపించును. వెల 4-0

## శ్రీ వీరబ్రహ్మముగారి చరిత్రము (బుఱ్ఱకథ)

శ్రీ కందిమల్లయపల్లె పోతులూరి వీరబ్రహ్మముగారి చరిత్రను
బుఱ్ఱకథ (జంగముకథ) రూపమున యింతవరకు యెవ్వరు ప్రకటింప
లేదు. సామాన్య విద్యావంతులకు పామరజనంబులకు సులభముగ
అర్థమగునటుల వ్రాయించి ప్రకటించితిమి కథ మొదటినుండి కడవఱకు
క్రమముగ సాగింపబడినది. జంగముకథ (సుద్దులు) చెప్పి జీవించు జం
గములకు యీకథను నేర్చినచో ప్రజలను సంతోషపెట్టవచ్చును. 2-00

సి. వి. కృష్ణా బుక్ డిపో, తపాలుపెట్టె నెం. 180వ మదరాసు-1

గ్రంథముల ధరలు

| | |
|---|---|
| విఘ్నేశ్వర పూజావిధానము | 1-00 |
| పెద్దబాలశిక్ష | 7-00 |
| జయరామ బాలశిక్ష | 3-00 |
| తెలుగు ఎక్కాలు 100 వరకు | 0-50 |
| ఆంధ్ర ద్రావిడ బాలశిక్ష | 2-00 |
| వస్తావేజుల మచిలీలు | 10-00 |
| పంచభాషలబోధిని | 2-00 |
| షడ్భాష శబ్దార్థ చంద్రిక | 10-00 |
| వైకుంఠ పాళీలు | 0-50 |
| ముగ్గుల పుస్తకము | 3-00 |
| కుట్టుపని స్వబోధిని | 15-00 |
| గణితబోధిని పెద్దది | 2-00 |
| నలచరిత్ర ద్విపద | 10-00 |
| ఉత్తరరామాయణము పద్యకావ్యము | 40-00 |
| శ్రీరంగనాథ రామాయణము (ద్విపదకావ్యం) | 40-00 |
| **శ త క ము లు** | |
| సుమతి శతకము | 1-50 |
| కృష్ణ శతకము | 1-50 |
| రామరామ శతకము | 1-50 |
| [illegible] శతకము | 1-50 |

| | |
|---|---|
| వేమన శతకము | |
| కుమారి శతకము | 1-50 |
| కుమార శతకము | 1-50 |
| భారత సావిత్రి | 1-50 |
| నరసింహ శతకము | 4-00 |
| గజేంద్రమోక్షము | 3-00 |
| ప్రథమకాండం అమరము | 3-00 |
| రుక్మిణీ కల్యాణము | 3-00 |
| దాశరధీ శతకము | 3-00 |
| ఆత్మలింగ శతకము | 3-00 |
| కాళహస్తీ శతకము | 3-00 |
| రామతారక శతకము | 3-00 |
| మల్లికార్జున శతకము | 3-00 |
| భాస్కర శతకము | 3-00 |
| **వ చ న గ్రం థ ము లు** | |
| భట్టి విక్రమాదిత్యుని కథలు (బైండు) | 40-00 |
| భట్టి విక్రమాదిత్యుని కథ చిన్నది | 10-00 |
| కళాభాను విజయము | 30-00 |
| అపూర్వ చింతామణి (బైండు) | 40-00 |
| కాశీ రామేశ్వర మజిలీ కథలు | 20-00 |

| | | | |
|---|---|---|---|
| గంగమ్మజాతర వేషపు కథ | 3-00 | మైరావణ చరిత్ర (చిన్నది) | 0-50 |
| మర్యాదరామన్న కథలు | 3-00 | నలమహారాజు కథ | 10-00 |
| సుంకరి కొండడి వేషపు కథ | 3-00 | నల్లతంగాళ్ కథ | 4-00 |
| నలుగురు మంత్రుల కథలు | 10-00 | కమ్మవారి పణతి పసలబాలరాజు కథ | 4-00 |
| వినోదకథామంజరి | 10-00 | రేచుక్క పగటిచుక్క కథలు | 4-00 |
| విరాటపర్వం జంగం కథ | 10-00 | మదనకామరాజు కథ | 20-00 |
| పంచపాండవుల వనవాసము | 10-00 | చిత్తూరుజిల్లా అదాలతు కోర్టుతీర్పు | 10-00 |
| పంచపాండవుల అజ్ఞాతవాసము | 20-00 | కబీరుదాసు చరిత్ర (పెద్దది) | 40-00 |
| బొమ్మల బాలనాగమ్మ కథ | 10-00 | చార్ దర్వేసు అనగా నలుగురు ఫకీరుల చరిత్ర | 20-00 |
| గయోపాఖ్యానం జంగం కథ | 10-00 | హరిశ్చంద్ర వచనం (పెద్దది) | 20-00 |
| పెద్ద బొబ్బిలిరాజు కథ | 10-00 | భద్రాచల రామదాసు చరిత్ర | 10-00 |
| దేశింగురాజు కథ | 10-00 | సూర్యచంద్రుల కథ | 0-50 |
| కామమ్మ కథ | 4-00 | శతకంఠ రామాయణము వచనం | 30-00 |
| కాంభోజరాజు కథ | 4-00 | సహస్రకంఠ రామాయణము వచనం | 30-00 |
| లక్ష్మమ్మ కథ | 3-00 | శరీర మర్మశాస్త్రము అనేక పటములతో | 30-00 |
| చిన్నమ్మ కథ | 3-00 | పరమానంద శిష్యులు | 6-00 |
| ఆరు మరాటీలు కథ | 0-50 | శుకసప్తతి కథలు | 20-00 |
| పురూరవ చక్రవర్తి కథ | 6-00 | భోజ కాళిదాసు కథలు | 10-00 |
| స్త్రీ భక్తవిజయము | 20-00 | పదునాలుగురాజుల కథలు | 10-00 |

**తారకామృతసారము**

| | |
|---|---|
| సన్యాసమ్మకథ | 10-00 |
| కాలజ్ఞాన తత్వములు | 6-00 |
| **వచన కాలజ్ఞానము** | 3-00 |
| భగవన్నామ సంకీర్తనలు | 4-00 |
| ఆత్మబోధామృత తత్వములు | 4-00 |
| కబీరుదాసు కీర్తనలు | 4-00 |
| త్యాగరాయకృతులు | 0-50 |
| పెద్దదాసు చరిత్ర | 3-00 |
| **కుశలవ కుశ్చాల చరిత్ర** | 10-00 |
| కుశలవుల యుద్ధము | 10-00 |
| తెనాలి రామకృష్ణుని కథలు పెద్దది | 10-00 |
| ,, చిన్నది | 3-00 |
| గులేబకావళి కథ | 10-00 |
| అభిమన్యునియుద్ధం (పద్మవ్యూహము) | 20-00 |
| **వ్రతములు** | |
| 28 వ్రతములు | 20-00 |
| త్రినాధ వ్రతకల్పము | 1-50 |
| 6 వ్రతములు | 6-00 |
| కేదారేశ్వర వ్రతకల్పము | 1-50 |
| | 4-00 |

| | |
|---|---|
| ధర్మాంగధ చరిత్ర పాటలు | - - - |
| గంగా వివాహము | 6-00 |
| కుశలాయకము | 6-00 |
| వరహావతారం చరిత్ర | 4-00 |
| శశిరేఖాపరిణయము పదం | 4-00 |
| లంకాయాగం | 4-00 |
| లక్ష్మణమూర్ఛ పదం | 4-00 |
| **నాటకములు** | |
| మంత్రిగుంట శశిరేఖ పరిణయనాటకము | 6-00 |
| వేదశైల చిత్రాంగి నాటకము | 10-00 |
| చింతగుంట గయోపాఖ్యాన నాటకం | 6-00 |
| లేపాక్షి రామాయణము | 20-00 |
| గయోపాఖ్యాన నాటకం | 6-00 |
| బెడుదూరు శశాపూర్ణోదయ నాటకం | 6-00 |
| గరుడాచల నాటకము | 6-00 |
| సారంగధర నాటకము | 4-00 |
| యక్షప్రశ్నలు | 4-00 |
| తిరువళ్ళూరు హరిశ్చంద్ర నాటకము | 10-00 |
| సుబ్బకవి ప్రహ్లాద నాటకము | 10-00 |
| యిగుడూరు కృష్ణవిజయ మను కంసవధ నాటకం | 10-00 |

| | |
|---|---|
| వేమన నీతిపద్య రత్నావళి | 30-00 |
| వేమనపద్య కఠినపదార్థమంజరి | 15-00 |
| వేమన యోగ పద్యరత్నములు | 10-00 |
| శ్రీ మహాభక్తవిజయం (బైండు) | 40-00 |
| మహాభక్త విజయం చిన్నది | 20-00 |
| గురుగీతాసారము బైండు | 40-00 |
| వేమన జ్ఞానమార్గం 3002 పద్యములు గలది (బైండు) | 40-00 |
| శుక బ్రహ్మ కైవల్యం | 20-00 |
| వేదాంత రహస్య దర్పణము | 20-00 |
| శ్రీకృష్ణ రుక్మిణీ సంవాదము | 20-00 |
| శాంత గోవిందనామం | 4-00 |
| అడవి గోవిందనామం | 4-00 |
| గురుశిష్య సంవాదం | 10-00 |
| నీతిశాస్త్రము | 4-00 |
| శ్రీరామనామ మహాత్మ్యం | 1-50 |
| ఆంజనేయ దండకం | 0-30 |
| శ్రీరామ దండకం | 0-30 |
| అమ్మవారి దండకం | 0-30 |
| [illegible] | 0-30 |

| | |
|---|---|
| స్త్రీలపాటలు 26 పాటలు గలది | 20-00 |
| నూతన పెండ్లిపాటలు | 1-00 |
| **సహస్రనామములు** | |
| విష్ణు సహస్రనామం | 5-00 |
| వెంకటేశ్వర సహస్రనామం | 5-00 |
| శ్రీరామ సహస్రనామం | 5-00 |
| ఆంజనేయ సహస్రనామం | 5-00 |
| కృష్ణ సహస్రనామం | 5-00 |
| శివ సహస్రనామం | 5-00 |
| గణపతి సహస్రనామం | 5-00 |
| సుబ్రహ్మణ్య సహస్రనామం | 5-00 |
| లక్ష్మీ సహస్రనామం | 5-00 |
| లలితా సహస్రనామం | 6-00 |

---

**పాతాంజల యోగశాస్త్రము** **15-00**

(తాత్పర్యము గలది) ఇది హఠయోగమునందు గల విషయములగు యోగములం బోలినదై సూక్ష్మాంశము లగు విద్యలను విమర్శచే యోగాంగ పరిశీలనవల్ల నిజ [illegible]

